[illegible]స్తు

[illegible]మలింగేశ్వరాభ్యాంనమః

[illegible]కృత

శ్రీమదాంజనేయ భుజంగ ప్రయాత స్తోత్రంబును

పంచరత్నశ్లోక స్తోత్రముల యుక్తమగు

# —*ఆపన్నివారణ స్తోత్రాఖండమాలిక*—

ఇయ్యది,

శికింద్రాబాద వాస్తవ్యుడును

తోడుపునూరి రాజయార్యునికుమారుడగు

[illegible] ండయార్యునిచే

రచియింపబడినది

ఆపత్కాలంబున సర్వజనులకు పారాయణయోగ్యంబనిదలంచి

గ్రంథకర్త స్వకీయ గోత్రజుండగు

హాయిదరాబాద్

యిసామియ్యాబజారు

వాస్తవ్యుడగు

చిరంజీవి

మిర్యపుకాయల యల్లయ్యగారి ద్రవ్యసహాయంబుచే

శ్రీ

ఓంకారముద్రాక్షరశాలయందు ముద్రింపంబడియె

శికిందాబాద్

౧౯౧౪ సం॥

ఆనంద సం॥ ఆశ్వీయుజ శు॥ ౨

...స్తు

...రామలింగేశ్వరాభ్యాంనమః

...కృత

శ్రీమదాంజనేయ భు...ంగ ప్రయాత స్తోత్రంబును

పంచరత్న శ్లోక స్తోత్రముల యుక్తమగు

# —*ఆపన్నివారణ స్తోత్రాఖండమాలిక*—

ఇయ్యది,

శికింద్రాబాద వాస్తవ్యుడును

తోడుపునూరిరాజయార్యునికుమారుడగు

కొండయార్యునిచే

రచియింపబడినది

ఆపత్కాలంబున సర్వజనులకు పారాయణయోగ్యంబనిదలంచి

గ్రంథకర్త స్వకీయ గోత్రజుండగు

హాయిదరాబాద్

యినామియ్యాబజారు

వాస్తవ్యుడగు

చిరంజీవి

మిర్యపుకాయల యల్లయ్యగారి ద్రవ్యసహాయంబుచే

శ్రీ

ఓంకారముద్రాక్షరశాలయందు ముద్రింపంబడియె

శికింద్రాబాద్

౧౯౧౪ సం॥

ఆనంద సం॥ ఆశ్వీయుజ శు॥ ౨

# —∗ అవతారిక. ∗—

శ్లో॥ హరేర్నామైవనామైవ। నామైవమమజీవనం।
కలౌ నాస్త్యేవనాస్త్యేవ। నాస్త్యేవగతిరన్యథా॥

అధర్మప్రవర్ధమానంబగు నీకలికాలంబున కొలదిదినములక్రిందట కొందరు దుర్మార్గులు ఓర్వజాలమిచే నాయందు శత్రుత్వము వహించి సహింపరాని బాధలనుగావించిరి. నేను చిన్ననాటనుండి విద్వాంసులగు పెద్దలవలన బోధితుడనై సంస్కారసంపన్నుండనగుటచే న్యాశాస్త్రజ్ఞులకు "దండం ధర్మ మిత్యాహుః" యనుప్రమాణానుసారముగా శిక్షాపూర్వకముగ సద్వృత్తులను గలిగించి నాకు చిత్తవిశ్రాంతి ప్రసాదించుటకు భక్తిపురస్సరముగా నీశ్వరధ్యానరూపంబగు నీస్వల్పగ్రంథమును రచించి భగవదర్పణము గావించినాడను.

మరియు బ్రహ్మవేత్తలకు విన్నవించునదేమనగా, పరమేశ్వరుండజుండును, అవ్యయుండును, సర్వభూతేశ్వరుండును, నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్త, స్వభావుండయ్యును జ్ఞానైశ్వర్యశక్తి బలవీర్యతేజోసంపన్నుండు గావున

శ్లో॥ అజోపిసన్నవ్యయాత్మా। భూతానామీశ్వరోపిసన్। ప్రకృతింస్వామధిష్ఠాయ। సంభవామ్యాత్మమాయయ॥ యదాయదాహిధర్మస్య గ్లానిర్భవతిభారత। అభ్యుత్థానమధర్మస్య। తదాత్మానంసృజామ్యహం॥
పరిత్రాణాయసాధూనాం। వినాశాయచదుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయ। సంభవామియుగేయుగే॥

అనునట్లు సాధుజనుల రక్షించుటకును, దుష్టుల శిక్షించుటకును జగత్పరిపాలనా హేతుభూతంబులగు ధర్మంబుల స్థాపించుటకు స్వేచ్ఛానిర్మిత మాయామయ స్వరూపములదాల్చు గావున తత్సగుణమూర్తులగొన్నింటి నిచట స్తుతింపబడె గావున బుధజనులు నన్ను మన్నింతురు గావుత,

మరియు నీగ్రంథాదియందు శత్రుహరణంబును, పాపశమనంబును, ఆపన్నివారణంబొనరించి శుభంబునొసగెడి శ్రీశంకర భగవత్పాదాచార్య స్తోత్రంబగు శ్రీహనుమద్భుజంగ ప్రయాతస్తోత్రంబును శ్రీహనుమత్పంచరత్న కృతంబును జేర్చినందునకై నీగ్రంథంబును పారాయణంబొనర్చినవారి కత్యంతోపకారియగునని దలంచి హాయిదరాబాద్ యూసామియ్యా బజారు వాస్తవ్యుడును మత్స్వకీయగోత్రజుండగు చిరంజీవి మిర్యపుకాయల మెల్లయ్యగారు తన ద్రవ్యసహాయంబుచే నీగ్రంథంబు నచ్చువేయించినందులకై వీరి కాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి గలిగి సుఖంబొందుగావుతయని భగవంతుని బ్రార్థించినాడ.

ఇట్లు,
గ్రంథకర్త తోడుపునూరి కొండయ్య.

శ్రీ మహాగణాధిపతయే నమః

# శ్రీహనుమద్భుజంగ ప్రయాత శ్లోకములు,

పారాయణయోగ్యము

---

ఉదారాంతరంగం సదారామభక్తం సముద్దండసత్త్వం ద్విషద్దండనోగ్రం। అమోఘానుభావం తమోఘాతదక్షం తనూమత్త్విరాజం హనూమంతమీడే॥ ౧ ॥ కిరీటిధ్వజాంకం కరోద్భాసిటంకం హతాశేషపంకం రణాదిర్విశంకం। త్రిలోకీమృగాంకం స్ఫురత్కుండలాంకం క్షణాధ్వస్తలంకం భజే నిష్కళంకం॥ ౨ ॥ ప్రసన్నానురాగం ప్రభాభాసితాంగం జగద్గీతశౌర్యం తుషారాద్రిధైర్యం। తృణీభూతహేతిం రణోద్యద్విభూతిం భజే వాయుపుత్రం పవిత్రాత్పవిత్రం॥ ౩ ॥ భజే హేమమరం భావనాసత్యవాసం భజే బాలభానుప్రభాచారుభాసం। భజే చంద్రికాకుంద మందారహాసం భజే సంతతం రామభూపాలదాసం॥ ౪ ॥ భజే లక్ష్మణప్రాణరక్షాతిదక్షం భజే తోషితానేకగీర్వాణపక్షం। భజే ఘోరసంగ్రామసీమాహతాక్షం భజే రామనామాతిసంప్రాప్తదీక్షం॥ ౫ ॥ కృతక్ష్వేళనాదం క్షితిక్షిప్తపాదం ఘనాక్రాంతజంఘం కటిస్థోరుసంఘం। అజాండస్థకేశం భుజాశ్లేషితాశం జయశ్రీసమేతం భజే రామదూతం॥ ౬ ॥ చలద్వాలఘాతభ్రమచ్చక్రవాళం కఠోరాట్టహాసాత్ప్రభిన్నాబ్జజాండం। మహాసింహనాదాద్విశీర్ణత్రిలోకం భజాంజనేయం ప్రభుం వజ్రకాయం॥ ౭ ॥ రణే భీషణే మేఘనాదే సనాదే సరోషం సమారోప్య సౌమిత్రిమంసే। ఖగానాం ఘనానాం సురాణాం చ మార్గే నటంతం సమంతాదనూనం తమీడే॥ ౮ ॥ నఖధ్వస్తజంభారిదంభోళిధారం స్ఫురద్దంతనిర్ఘాతకాలోగ్రదండం। పదాఘాతభీతాహిజాతాధివాసం రణక్షోణిదక్షం భజే పింగళాక్షం॥ ౯ ॥ మహాభూతపీడాం మహోత్పాతపీడాం మహావ్యాధిపీడాం మహాధిప్రపీడాం। హరత్యాశు తే పాదపద్మానురక్తిర్నమస్తే కపీంద్ర ప్రశస్తప్రశస్తే॥ ౧౦ ॥ జ్వలత్కాలయుగ్రాంతి రౌద్రప్రతాపం రణక్షోణికక్షాను సుక్షాత్యవేక్షం। కపీంద్రాన్ సురేంద్రాదిషు ప్రైతా మహాస్త్రం భవంతం వినా కోపి జేతుం సమర్థః॥ ౧౧ ॥ సుధాబ్ధిస్సముల్లంఘ్య పాథోధిశీఘ్రే సుధాంధః ప్రగుప్తాస్సుధామోఘమధీస్తాః। క్షణాద్ద్రోణశైలస్య సారేణ నేతుం వినా స్యాత్ప్రయోగః కస్సమర్థః కపీంద్రః॥ ౧౨ ॥
ఈ ...నంతరంగాది రౌద్రం వినిద్రం విల్లుం ఘ్యాముబంధం హాం త్రిలోకామస్త్యసంఘ

నిరాతంకమావిశ్యలంకాం విశంకో భవానేవసీతాధి తాపాపహారీ। ౧౩।
రిమానాథరామ క్షమానాథరామా మశోకే సశోకాంస మాశ్వాస్య
వాక్యైః। బలాత్తద్వనం భంజయిత్వాన ఖాగ్రైః ప్రహర్షీ హనుమాం
స్త్వమేవత్వమేవ। ౧౪। జ్వరాపార్యభూతాది పీడాం శరీరే నివార్యక్షమా
ర్యాశు గాఢప్రతాప। భవత్పాదభక్తిం భవద్భక్తరక్తిం కురు శ్రీహనూమన్
ప్రభో మేదయాళో। ౧౫। మహాయోగినో బ్రహ్మరుద్రాదయోవాన జా
నంతితత్త్వం నిజం రాఘవస్య। కథం జ్ఞాయసే తాదృశం తత్త్వమేవ ప్రసీద ప్ర
సీద ప్రభో వానరేంద్ర। ౧౬। ప్రదోషే ప్రభాతే దివాచార్ధరాత్రౌ శు
భాంగం చిదానంద లీలాప్రసంగం। సదా పావనం మానసే భావయేద్య స్స
ధన్యస్సమాన్యో నతస్యాపదస్తి। ౧౭। బిలద్వారిభూపాలక ద్వారిఘోరే
మహావ్యాఘ్రసింహ కులారణ్యభాగే। శరణ్యాయపుణ్యాత్మ దీప్తేనమస్తే
నమస్తే కపిశ్రేష్ఠ రామప్రియాయ। ౧౮। నమస్తే మహాసత్త్వ భావాయతు
భ్యం నమస్తే మహావజ్ర దేహాయతుభ్యం। నమస్తే మహా కాలకాలాయతు
భ్యం నమస్తే మహాదీర్ఘ వాలాయతుభ్యం। ౧౯। నమస్తే మహాశౌర్య ధు
ర్యాయతుభ్యం నమస్తే తమోజ్ఞాన సూర్యాయతుభ్యం। నమస్తే కృతామ
ర్త్య కార్యాయతుభ్యం నమస్తే సదాబ్రహ్మ చర్యాయతుభ్యం। ౨౦।
నమస్తే హనూమన్ మనస్తాపహారిన్ నమస్తే సమస్తా మరస్తుత్యకీర్తే। నమస్తే
నిరాయాస సన్నిస్తీర్ణసింధో నమస్తే దయాళో సదాదీనబంధో। ౨౧। ని
శాంతం శ్రియాంతం రిపూంత్సంహరంతం హసంతం సదారామ భూమావ
సంతం। మహత్వానుమంతం సుధైర్యేణదాంతం కృతాంతం ఖిలానాం హ
నూమంతమీడే। ౨౨। నమస్తే హనూమన్ రఘుధ్వాంతభానో నమస్తే హ
నూమన్ భజత్కామధేనో। నమస్తే హనూమన్ రిపుశ్రీకృశానో నమస్తే
హనూమన్ జగత్ప్రాణసూనో। ౨౩। నమో మత్స్యకూర్మాది నానావ
తారైర్యుతస్యాచ్యుతస్యేష్ట కార్యోద్యతాయ। భవిష్యద్విధాత్రే జగత్సృ
ష్టికర్త్రే। నమః క్లేశపాయాసురాణాం నిహంత్రే। ౨౪। మఖాదిక్రియావిష్ణు
కృద్దైత్యహంత్రే శరణ్యాయతస్మై నతోస్మ్యేవతోస్మి। పఠన్వైశతోపి
ప్రముక్తో భుజాత్తైస్సనైస్సర్వదా రామభక్తిం ప్రయాతి। ౨౫। ఇతిశ్రీశంక
ర భగవత్పాదాచార్య విరచితశ్రీహనూమద్భుజంగ ప్రయాతస్తుతి
సంపూర్ణమ్॥

## శ్రీహనుమత్పంచరత్నమ్.

వీతాఖిలవిషయేచ్ఛం జాతానందాశ్రుపులక మత్యచ్ఛమ్। సీతాపతిదూ

తాద్యం వాతాత్మజ మద్యభావయే హృద్యమ్॥ ౧ ॥ తరుణారుణ ముఖకమ
లం కరుణారసపూరపూరితాపాఙ్గం। సంజీవనమా శాసేమంజుళమహిమా
నమంజనాభాగ్యమ్॥ ౨ ॥ శంబరవైరిశరాతిగమం బుజదళవిపులలోచనో
దారమ్। కంబుగళమనిలదిష్టం బింబజ్వలితోష్ఠమేకమవలంబే॥ 3 ॥ దూరీ
కృతసీతార్తిః ప్రకటీకృతరామవైభవస్ఫూర్తిః। దారితదశముఖకీర్తిః పుర
తోమమ భాతుహనుమతోమూర్తిః॥ ౪ ॥ వానరనికరాధ్యక్షం దానవకు
లకుముదరవికరసదృక్షం। దీనజనావనదీక్షం పవనతపః పాకపుంజమద్రా
క్షమ్॥ ౫ ॥ ఏతత్పవనసుతస్యస్తోత్రంయః పఠతిపంచరత్నాఖ్యమ్। చిరమి
హనిఖిలాన్ భోగాన్భుక్త్వా శ్రీరామభక్తిభాగ్భవతి॥

ఇతిశ్రీమచ్ఛంకరాచార్యవిరచితమ్

హనుమత్పంచరత్నం సంపూర్ణమ్.



శ్రీరస్తు

శ్రీమత్పర్వతవర్ధనీసహిత రామలింగేశ్వరో విజయతే

# ఆపన్నివారణస్తోత్రాఖండమాలిక

* నాందీపంచరత్నములు *



క॥ శ్రీగజముఖునజురాణిన్ । సాగిలబడిమ్రొక్కి మిగుల । సన్నుతిజేతున్ ।
రాగాదిరహితమాపర । భోగంబునుజెందబుద్ధి । బోడమునటులగాన్ ॥ ౧

క॥ శ్రీబాలాత్రిపురేశ్వరి । మాబాలులబ్రోచిమిగుల । మంగళకరమున్ ।
చేబూనితానొసర్పగ । నాబాలామణికొనర్తు । నతివందనముల్ ॥ ౨

క॥ శ్రీశునివిధిగిరిజేశుని । యీశులటని కేల్మొగిడ్చి । యీపద్యములన్ ।
యాశగొనిజెప్పినాడను । యాశాశ్వతమైనపదవి । నందదలచినేన్ ॥ ౩

క॥ క్షీరోదధిజననంబై । మాపునితండ్రినివివాహ । మైముదమొదవన్ ।
కూర్మినిశిరులనొసగెడి । మాజననికిమ్రొక్కులిడుదు । మరిమరివేడ్కన్ ॥

క॥ శ్రీరామనామమెపుడే । మారకజపియించుపరమ । మార్గాన్వితునిన్ ।
చాపునరపింగళాత్మున్ । నేరంబులుదొలగనాంజ । నేయునిదలతున్ ॥ ౫

* శ్రీరామలింగేశ్వరప్రార్థన *

క॥ కానున్నదికాగలదని । మానుగజనులనెడిమాట । మదినూహించన్ ।
కానిపనికేలనినుమది । బూనగవలెరామలింగ । బుధజనసంగా । ౧

క॥ భక్తియనుచేలగుపునా । సక్తినిబూజించుచేల । సకలంబునకున్ ।
వ్యక్తులకథలప్పైయను । రక్తిలనురామలింగ । రాజధరాంగా ॥ ౨

క॥ నీకథలయందుభక్తులు । ప్రాకటముగనిన్నుగొల్చి । పాయనిసుఖముల్ ।
చేకొనిరనుటలుకల్లలె । సాకారారామలింగ । సన్మునిసంఘా । ౩

క॥ నమ్మికతోనినుదలచెద । ముమ్మాటికిదిక్కటంచు । మురిపముతోడన్ ।
కమ్మనిమాటలనేనీ । సొమ్మనుచునురామలింగ । సోమరథాంగా ॥ ౪

క॥ ఎవరేమనిదూషించిన । భువనాధీశ్వరనొకింత । బుగులొందనికన్ ।
భవహరయనిస్మరియించెద । కవిపోషకరామలింగ । కారణసంగా ॥ ౫

తే॥ గీ॥ ఓనమాలనుజదువగా। నోదివేసీదు। నామమంత్రంబునదిగురు। నా
శ్రయించ। తేటతెల్లముగాదెల్పె। తేజమలర। రమ్యమొప్పగభజి
యింతు। రామలింగ॥ ౬

తే॥ గీ॥ కలఁడుకలఁడంచుకొందరు। ఘనతరముగ। లేఁడులేఁడంచుకొందరు
లీలమెరయ। బల్కుచుందురునినుధర। పలువిధముల। రమ్యగుణ
గణసంగశ్రీ। రామలింగ॥ ౭

తే॥ గీ॥ కలఁడనుచునిన్నుమదినమ్మి। సలలితముగ। భక్తిచేసంస్మరించెద।
బాగుమీర। అన్నిటికిదిక్కునీవెయా। పన్నరక్ష। రమ్యగుణగణ
సంగశ్రీ। రామలింగ॥ ౮

తే॥ గీ॥ కుచ్ఛితులుశతులతికౄర। గుణముగల్గు। కుమతులెల్లనుగుమిగూడి
విమలమతుల। మనసునొప్పించుటరయగా। మండిపోరె। రమ్యగుణ
గణసంగశ్రీ। రామలింగ॥ ౯

క॥ ఆనందమునారోగ్యము। మానుగసంపదనుముదము। మర్యాదనుస।
న్మానముగోరెడుమనుజులు। పూనరుదుష్కృతముజేయ। పురహరలింగా॥

తే॥ అరయనుర్న్నాన్నులకుసన్న। యుంబుజేయు। ~~[illegible]~~ లై
పాముగారె। క్షీరములుబోసిపెంచిన। చిలువపగిది। రమ్యగుణగణ
సంగశ్రీ రామలింగ॥ ౧౧

తే॥ అంగిటవిసంబునున్నానొక్కెయంసుతీపు। గలిగివినయంబుజూపెడు। క
లుషమతులు। చెడుదురెన్నటికైననీ। పుడమిలోన। రమ్యగుణగణ
సంగశ్రీ। రామలింగ॥ ౧౨

తే॥ బూటకపువేషములవేసి। పుడమిలోన। జనులవంచింపసాకుల। గసకు
మతులు। వేగమునజెడిపోదురో। వేదవేద్య। రమ్యగుణగణసంగశ్రీ
రామలింగ॥ ౧౩

తే॥ ఎవరెవరునెంతద్రోహంబు। నేగిజేసి। రట్టివారలుసునులమ। టసుచు
నుందు। నీదుముక్కంటజూడుమో। నీలకంఠ। రాజసూర్యరధాంగశ్రీ
రామలింగ॥ ౧౪

తే॥ పాలుమాలకనీనామ। భజనజేయు। చుండెదనునీవెదిక్కని। ఖండిత
ముగ। రిపుసమూహములకుశిక్ష। రేపనకుము। రాజసూర్యరధాంగశ్రీ
రామలింగ॥ ౧౫

తే॥ నిన్నునమ్మినవాఁడనో। నిర్మలాంగ। చెనటిపగతులుహాస్యంబు। జేయ

కుండ! కార్యసాధన మొనరించు కరుణ వెలయ! రాజసూర్యరథాంగశ్రీ
రామలింగ॥ ౧౬

క॥ పంచాక్షరియను మంత్రము నంచితముగ జిహ్వయందు! నమరఁగ మరిమరిఁ
కొంచముగాక జపించెద! పంచముఖా రామలింగ! భవభయభంగా॥ ౧౭॥

క॥ ఓసురనరకిన్నరనుత! భాసుర కైలాసవాస! భవ్యవిలాసా!
నీసములు లేరు జగతిని! వాసవనుత రామలింగ! వైరివిభంగా॥ ౧౮

క॥ వారణత్వగ్ధర కామిత! పూరణ భక్తామరేశ! భూషణసర్పా!
వైరిసముదయనివారణ! కారణ శ్రీరామలింగ! కరుణాపాంగా॥ ౧౯

క॥ భాసురగౌరీహృదయని! వాసా మామకహృదబ్జ! బంభరకరుణా!
కాసారా భక్తాళిసు! ధీసంస్తుత రామలింగ! దేవశుభాంగా॥ ౨౦

క॥ జీవుడు శివుడను భేదము! భావమునన్ వీడ విమూఢ! పరులెవ్వరికిన్!
నీవేని వాదుపుగా! కోవిదనుత రామలింగ! గుణరహితాంగా॥ ౨౧

* శ్రీబాలాత్రిపురసుందరీస్తోత్రము *

క॥ శ్రీబాలా శివలోలా! నీబాలుడనన్ను జోప్రు! నెనరున సరగన్!
మీ బాము తత్తిలి నాముచు! యీబామున నీదు భజన! నెలమిగ జేతున్॥

క॥ ఎక్కడ నెప్పుడు నీవే! దిక్కని నెరనమ్మినాడ! దీనుడనాపై!
మక్కువనుంచుము సరగా! చక్కని మహిషాసురారి! శాంభవి బాలా॥ ౨౩

క॥ లలితామణిభూషణసం! కలితా మధుకైటభారి! ఘనసుగుణమణీ!
జలజాతేక్షణు సోదరి! చెలువలరెడు శూలపాణి! చెలువా బాలా॥ ౨౪

క॥ వాగీశ్వరినూడిగముల! బాగుగ జేయంగ వెలయు! బాలాశీలా!
యోగీశ్వరాదివినుతా! శ్రీగౌరీ హిమగిరీశు! జన్నికుమారీ॥ ౨౫

క॥ సన్మునిగణసేవితవిల! సన్మణినూపురపదాబ్జ! జలజాతాక్షీ!
సన్మసముతోడ గనుమో! షణ్ముఖహేరంబజనని! శాంకరి బాలా॥ ౨౬

క॥ కాలారికిబ్రియసతివై! కోలాహలముగను దైత్య! కోటుల నెల్లన్!
లీలందునిమిన బాలా! జాలింబడినాడ బ్రోవు! జలజాతాక్షీ॥ ౨౭

క॥ అంబా శాంకరి భక్తక! దంబా త్రిపురారిజాయ! దానవమథనా!
కంబుగళా మునిమానస! బింబామది లోదలంతు! ప్రియముగ బాలా॥ ౨౮

తే॥ భైరవీ భగమాలిని! భద్రకాళి! శ్యామలా సురమర్ధని! సకలజనని!
పరమకారుణ్యదాయిని! పాపహారి! లీలగా బ్రోవు భక్తాను! కూలబాల॥

తే॥ చండభండాద్యసురులను భండనమున! సంహరించిన యీశ్వరి! శత్రువులకు!

నిండుముదమునదగు కేలి సీతిజెప్పి । యరయనా బాధదొలగించు । మమ్మ బాల

క॥ బాలా ఐం క్లీం సౌయని । వాలాయముగాను నిన్ను । వదలక నడిగా ।
చాలజపియింతు వేడ్కను । శ్రీ లాలితమై జెలంగ । చెలువ్రదనరగా ॥ 3౧

క॥ సూర్యేందుమకరకుండల । యార్యావరభూషణాంగి యఖిలఫలకా ।
శౌర్యంబొప్పగనాదగు । కార్యంబులజేయుమమ్మ । ఘనముగ బాలా ॥

క॥ ఇందీవరలోచనసా । క్రందననుతకుందరదన । కామితఫలదా ।
మందగమన నీసరివా । రెందునుగన లేరుచూడ । నిలలో బాలా ॥ 33

క॥ ఆయీ సుందరమంగళ । కాయా నిజభక్తలోక । కరుణాదాత్రీ ।
నీయానయమృతమాడను । జేయుము నా బాధదొలగ । శ్రీకర బాలా ॥ 3౪

క॥ నిత్యానందిని సత్యా । సత్యవిచారాఢ్యశీల । సామజగమనా ।
కాత్యాయని వినుతించెద । నత్యంతముదయను జూడు । మమ్మా బాలా ॥ 3౫

క॥ ఘనవేణీ శుకవాణీ । ఘనతరకళ్యాణబాణ । కార్ముకపాణీ ।
మనసిజహరహరురాణీ । యనుమానింపక ననుబ్రోవు । మమ్మా బాలా ॥

క॥ మొల్లలతో బూజించెద । కొల్లలుగా భక్తినింత । కొరతనరాకే ।
చల్లగ జూడుము శంకరు । నిల్లాలా నాదుతల్లి । హిమగిరిబాలా ॥ 3౭

క॥ చాలగ మదినొచ్చితినే । లీలన్ గనుగొన్న నీవె । లేశంబైనన్ ।
లాలించువారలెవరిక । జాలింగనుమమ్మ సుగుణ । జాలా బాలా ॥ 3౮

క॥ ఎప్పుడు నీదయగల్గునొ । యప్పుడెనా బాధలెల్ల । నణగియుటుండున్ ।
చప్పుడుజేయక యుండెద । మెప్పైన మహేశురాణి । మేదిని బాలా ॥ 3౯

క॥ భక్తజనకల్పలతికా । శక్తీ కామృడాని । శరదిందుముఖీ ।
రక్తాక్షి శత్రునాశిని । సూక్తులగైకొనుము బాల । శుభగుణలీలా ॥ ౪౦

క॥ నిగమంబులు నినుజాలగ । బొగడుంగదమేటి వనుచు । పూర్ణదయాఢ్యా ।
పగతురలావ్రనడంచుము । నగరాజకుమారి బాల । నయగుణశీలా ॥ ౪౧

క॥ కోపంబుంచక నాదగు । పాపంబుల బారద్రోలి । పాయక యెపుడున్ ।
తాపములేని మనస్థితి । దీపింపగజేయుమమ్మ । దీనుడ బాలా ॥ ౪౨

క॥ బాలాభక్తజనావన । శీలా శ్రీచక్రనిలయ । చిద్రూపాఢ్యా ।
లాలితముగ నినుదలచెద । ఫాలాక్షుని రాణి త్రిపుర । భైరవి లలితా ॥ ౪3

క॥ ప్రకృతిస్వరూపిణీ మది । వికృతినిజెందంగనీక । వేడ్కను బోధన్ ।
సకృతుగ నొసగుము సుతుడని । సుకృతంబౌగాక నీకు । సుందరి బాలా ॥ ౪౪

తే॥ గీ॥ మీనలోచన సుందరీ । మేచకాంగి । రాజరాజేశ్వరీయుతు । రాజవదన ।

రాజమాతంగివిమలస। ద్రాజితాంగి। యర్భకుడబ్రోవుబాలక। శ్యాణలీల॥

క॥ ఏదీనిదయనాపై। రాదాయనుజలజనేత్రి। రాకేందుముఖి।
పాదుగనీపాదములను। సాదరముగనమ్మినాడ। జాగాబాలా॥ ౪౬

క॥ అందంబుగనాపద్యము। లందరుపఠియించునటుల। నాసక్తిదగన్।
జెందగజేయుముబాలా। విందొనగదశక్తికొలది। వేడుకలలరన్॥ ౪౭

క॥ అమ్మానీవిటునామది। సమ్మతిగానుండిపల్కు। సదమలసూక్తుల్।
యిమ్మహినివ్రాసితినినే। నమ్ముగదోషములనెవ్వ। రెంతురుబాలా॥ ౪౮

* శ్రీరామచంద్రస్తోత్రము *

క॥ శ్రీరామారఘురామా। సారసలోచనసునామ। సంగరభీమా।
ఘోరాసురాళిదమనా। కారుణ్యముతోడమమ్ము। గావుమురామా॥ ౪౯

క॥ సలలితపూర్ణాకారా। తెలియకనేజేసినట్టి। తీవ్రక్రియలకున్।
జలమెంచకనన్నేలుమి। యిలలోనీకన్నదిక్కు। కెవ్వరురామా॥ ౫౦

క॥ నీభక్తుడునీశిష్యుడు। నీభక్తులనేలువాడు। నీప్రియుడరయన్।
నీభజనసదాజేసెడి। శోభనగుణుడైనవాయు। సూనుడురామా॥ ౫౧

క॥ నీవేయతడనిమనమున। భావించియనారతంబు। భక్తినిజేయన్।
నావగబాపడదేమో। శ్రీవనితాయుతమునీంద్ర। సేవితరామా॥ ౫౨

క॥ కొమరులుమతిజెడిచేసిన। క్రిమవిరహితకార్యములకు। కారుణ్యములే।
కమదినిపగనెంచెదరే। యమరాధిపవంద్యమామ। కావ్యారామా॥ ౫౩

క॥ శ్రీకాంతాపావనితో। నేకాంతవిచారగోష్టి। నెసగెడితఱియం।
దీకొమరునిస్థితిగతులను। ప్రాకటముగజెప్పుమయ్య। బాగుగరామా॥ ౫౪

క॥ సేరిచిసేరనిపలుకుల। కూరిమితోనిన్నుమదిని। గొనియాడెదనా।
సేరములనెన్నవలదో। సారోజ్వలమంజువాక్య। సంయుతరామా॥ ౫౫

క॥ భూజాతకబరియందున। తేజంబుగనుంచుకరము। దివ్యతరముగాన్।
రాజానాతలనుంచుము। రాజితవిమలప్రభాంగ। రాఘవరామా॥ ౫౬

క॥ అపవాదములనుబెట్టెడి। కుపితాత్ములశాంతిపఱచి। కొనకొనినాపై।
కృపనుంచిబ్రోవువేగమె। కపటారిసమూహహారణ। కారణరామా॥ ౫౭

క॥ ఏపాపకర్మడైనను। నీపాపునుగోరినంత। నిఖిలాఘంబుల్।
వేపారిపోవెయడరున। శ్రీపానీమరుగునెంతో। జేరితిరామా॥ ౫౮

క॥ ఆపదలుమాటిమాటికి। నేపారగరిపులవలన। నేతెంచినచో।
నీపాదములేదిక్కని। యోపిభజించెడినరుండు। యుక్తుడురామా॥ ౫౯

క॥ శ్రీలలనాముఖపంకజ। లీలాకరబంభరాని। లింపాళినుతా।
కాలారిమిత్రనీదయ। చాలగగోరితినిజాగు। సల్పకురామా॥ ౬౦

క॥ నినునెరనమ్మినవాడను। సనకాదిమునీంద్రవంద్య। సదమలచరితా।
యనుమానమేలచేసెదు। ననుబ్రోవనులాతివాడ। నాశ్రీరామా॥ ౬౧

క॥ నీపాపనిగాజూడుము। పాపానలతోయభక్త। పాలనశుభదా।
కోపంబించుకయుంచకు। మాపాలిటిదొరవటనుచు। మనియెదరామా॥

క॥ పాపారణ్యకుఠారా। నీపాపనిగాదలంచు। నిజమునగనెపుడున్।
మీపాదములనుగొలిచెద। పాపంబులబాయునటుల। భక్తిగరామా॥ ౬౩

క॥ శ్రీసీతానాయకనీ। భాసురమగుమోముజూపు। పలువిధములుగా।
గాసిల్లినాడననుదయ। జేసినముదమొందువాడ। శ్రీకరరామా॥ ౬౪

క॥ అందంబైమానిజనా। నందంబైమాకులకిని। నారతసుఖమై।
యొందునజూచినతావక। సుందరమౌనామమలరు। చోద్యమురామా॥

క॥ పాపిమురాచారుడుము। కోపిగురుద్రోహికుమతి। కుజనుండైనన్।
మీపాపుగోరనంతనె। కాపురుషుడుగాకయుండుఘనమౌరామా॥ ౬౬

క॥ శ్రీపామునిజనమానస। దీపాననుబ్రోవవేమి। దీనశరణ్యా।
పాపాదిబాధబాపిను। దీపంబగుజ్ఞానమిమ్ము। దివ్యధామా॥ ౬౭

క॥ వందనమురామచంద్రా। సుందరతరమందహాస। సురుచిరభాసా।
మందారమాలికాధర। కొందలమునుబాపినుదము। గూర్పుమురామా॥

క॥ జారులుచోరులునైనన్। నేరుపుతోనిన్నుదలచ। నేర్చినవారల్।
ఘోరతరాఘముబాసియు। పారసుఖంబులనుగందు। పరహితరామా॥

క॥ వామాంకమందుభూమిజ। సామీరియులక్ష్మణుండు। సరసవసింపన్।
నామదికోరతలుబాయగ। స్వామీప్రత్యక్షమగుము। సగుణరామా॥

క॥ సామీనీపైనగలదయ। నామీదనుకొంతకొంత। నాటుముదమునన్।
గామారిమిత్రసీతా। ప్రేమాస్పదమునవిగోనుము। ప్రియముగరామా॥

క॥ దినమణివంశోద్భవనీ। కనవరతముజోతలిడుదు। హరిపరమేశా।
యనుమానమేలనాదగు। మనమానందంబుజేయు। మాశ్రీరామా॥

క॥ యెంపగతుడైనభువిలో। నీపదభక్తులనునింద। నెరపినయంతన్।
కాపురుషులుగాకుందురె। నాపగతులజూతునేతృణంబుగరామా॥ ౭౩

క॥ ఏయాపదజనుదెంచిన। నాయుష్యమునన్నమైన। యపవాదంబుల్।
పాయకకరతెంచినచో। జేయవలెన్నీదుభజన। శిద్ధిగరామా॥ ౭౪

క॥ కుందంబులఁబోలినయీ। కందామలనామజిహ్వ। కదలగ నెపుడున్।
అందంబుగ జదివెదనో। సుందరతరమందహాస। సుగుణుడ రామా॥ ౯౦

## * శ్రీసీతాదేవిస్తోత్రము *

క॥ తల్లీనిన్నుదలంచెద। యుల్లంబున శత్రుబాధ। నుంచకయికనీ।
పిల్లనిగాఁజూడుము సం। ఫుల్లసరోజాక్షి వినుత। బుధజన సీతా॥ ౯౧

క॥ జనకునిపుత్రికవైశ్రీ। దినకరవంశాధిపునకు। దివ్యమహిషివై।
హనుమకునధిదేవతవై। ఘనమానినిభక్తిదలతు। ఘనముగ సీతా॥ ౯౨

క॥ నీకాప్తుడనీకొమరుడ। నీకై బహుపాటుబడిన। నిర్మలకాయుం।
డాకపికులశేఖరునకు। నాకష్టముబాపజెప్పు। నయముగ సీతా॥ ౯౩

క॥ యేపగిదిఁజూచెనాకిల। మీపదపంకజమెదిక్కు। మేలుకొఱకునై।
యీపగిదిబాగడబూనితి। నాపదలదొలంగజేయు। మమ్మయవనిజా॥

క॥ భూజాతాగుణనేతా। రాజితవైదేహపుత్రి। రమ్యసుగాత్రీ।
తేజమున నీదుపదయుగ। రాజీవంబులకు మ్రొక్కి। రాజిల్లెదనే॥ ౯౫

క॥ అమ్మా జానకిరాముని। కొమ్మా నిన్ను నమ్మినాడ। కోర్కులనిమ్మా।
ముమ్మాఱిదె మ్రొక్కెదవిను। సమ్మతిగాఁబుష్పవేణి। సదమలవాణీ॥ ౯౬

క॥ శ్రీసీతాభూజాతా। హాసమహోల్లాసభాస। యనుపమవేషా।
యాసించినాడఁబ్రోవుము। భాసురశ్రీరామవామ। భాగనివేశా॥ ౯౭

## * శ్రీమద్వీరాంజనేయస్తోత్రము *

క॥ శ్రీవాయుపుత్రనిన్నే। జీవాధారుండవనుచు। చెలువుగ నెపుడున్।
భావించిధరనుమనియెద। కోవిదనుతయాంజనేయ। కోమలహృదయా॥

క॥ స్వామీనామనవినివిని। సామీరీనాదుకార్య। చయముల నెల్లన్।
నీమంబుతోడ జేయుము। రామప్రియయాంజనేయ। రాజితకాయా॥ ౯౯

క॥ పంచముఖాననుఁగనుగొని। వంచన జేయందలంచు। వైరుల నెల్లన్।
కొంచముగఁజూచివంచుము। పంచముఖాత్మజహనూమ। పావననామా॥

క॥ న్యాయాన్యాయములనుగని। జేయుముసీతోచినంత। శ్రితజనపాలా।
వేయేలశత్రుజనము। న్హేయంబుగఁజూడుమాంజ। నేయసుకాయా॥ ౧౦౧

క॥ శూరాగ్రేసరుడవున। క్రూరజనావళినిబ్రోచు। గురుతరుడవున।
ద్ధీరుడవుదానవారివి। మేరుసమానుడవుహనుమ। మృదువరనామా॥

క॥ పింగళకంజదళాక్షా। అంగనవిరహాద్వ్యపేక్ష। యానసరవిభా।
సంగీతరసికమామక। సంగావీరాంజనేయ। సజ్జనగేయా॥ ౧౦౩



క॥ పగదలచినవారందరు। నిగమాదివినుతప్రభావ। నీకోపాగ్నిన్।
దగలాని యిడుమలబడరే। తగునటుగా హనుమ నిన్ను। దలచెద నెపుడున్॥

క॥ కలగన్న తెలివియున్నను। నిలలో జీవించుటంచు। నెలయుదనుకనిన్।
బలుప్రేమతోడ గొలిచెద। సలలితముగ నాంజనేయ। సజ్జనగేయా॥ ౧౦౭

తే॥ గీ॥ మరువకెప్పుడు నీకు నమస్కరింతు। బలుమదంబున కైవారము
ను జేతు। దుఃఖముల బాపజాలిన దొరవు నీవు। అమలగుణగణగేయ వీ
రాంజనేయ॥ ౧౦౮

క॥ హనుమాని నామామృత। మనుభవమొనరించువారి। కానందంబై।
ఘనమై రమణీయంబై। వినయంబై వెలయుచుండె। వివిధగతులగాన్॥

తే॥ గీ॥ వాయునందన నీపదవనజములకు। వందనశతంబులొనరింతు। సుం
దరముగ। మందమతినని కరుణను। మరువకెపుడు। యనుపమానం
దగేయ వీ। రాంజనేయ॥ ౧౦౯

క॥ దిక్కే నీవని మదిలో। మక్కువతో భజనజేసి। మనియెదనాపై।
మిక్కుటము జేయువారలు। తక్కకబామే చెడెదరు। తథ్యము హనుమా॥

ఆ॥ వె॥ చిన్ననాడె నిన్ను। చేపట్టినాడను। కాని చిన్నపనులు గల్గువాడ।
కొంకకు జేయుపనులు। దుడుకెంచు నాతండ్రి। యసురభయద
కాయ। యాంజనేయ॥ ౧౧౦

క॥ చేయదగిన పనులెల్లను। చేయక మందమతినయ్యు। చింతాలతతో।
బాయక యుండిననను కృప। జేయుము శ్రీయాంజనేయ। శ్రితజనసదయా॥

క॥ కోరెద నీపాదంబులు। మీరెద శత్రువులబారి। మేల్మేలనగన్॥
జేరెద నీభక్తులతో। కూరిమిగా నాంజనేయ। కోవిదగేయా॥ ౧౧౨

క॥ కాయంబస్థిరమనివిని। జేయరు నీభజనపాప। చేష్టలనెంతో।
జేయుదురు వారికేగతి। జేయుదువో యాంజనేయ। శ్రీకరగేయా॥ ౧౧౩

తే॥ గీ॥ పరుల శ్రేయస్సునకు నెప్డు భయములేక। చెడదగినపని జేతురు। సిగ్గు
మాలి। యిట్టివారల సవరింప। నీవె కావె। యమలగుణగేయ పంచ
ము। ఖాంజనేయ॥ ౧౧౪

క॥ పట్టితి నీపదపంకజ। మెట్టో నను కరుణజూచు। టినకులదాసా।
గట్టిగ నమ్మితి నెదచే। పట్టి విడువవలదు వాయు। పట్టి జెట్టీ॥ ౧౧౫

క॥ పూవండలనొసగెదనిక। నాదండను జేరియుండు। నయముగ నెపుడున్।
వేదండవరదు రాముని। కాదరమున దండమిడుదు। నాశుగతనయా॥

—* మంగళ పంచరత్నములు *—

క॥ మంగళము గజభంగా। మంగళము సురాదివినుత। మంజులవేషా।
మంగళమార్తినివారక। మంగళమో రామలింగ। మహనీయాంగా॥ ౧
క॥ మంగళమే శ్రీలలితా। మంగళమే శివునిరాణి। మంజులవాణీ।
మంగళము శ్రీపురసుందరి। మంగళమే బాలభక్త। మానితశీలా॥ ౨
క॥ మంగళము రామచంద్రా। మంగళమానందరూప। మహితకలాపా।
మంగళమార్తశరణ్యా। మంగళమిదె గొనుము రామ। మంజులనామా॥
క॥ మంగళమే భూజాతా। మంగళమానందనియుత। మనసిజమాతా।
మంగళము హనుమదాశ్రిత। మంగళమో రామచంద్రమహిషీ సదయా॥
క॥ మంగళము వీరహనుమా। మంగళకారణవిలాస మహితశరీరా।
మంగళమో పంచాసన। మంగళకరకార్యకరణ। మహనీయగుణా॥ ౫

—* ఫలశ్రుతి *—

ఆ॥ వె॥ ఈయఖండమాల। నెవరేని చదువుచుండ। భుక్తిముక్తిశుభము। భూమిజ
యము। నిక్కముగను గలుగు। నిదె గురుకరుణచే। రమ్యగుణగణాంగ।
రామలింగ॥ ౧

—* శ్రీమద్వీరాంజనేయ నక్షత్రమాలిక *—

క॥ నీభక్తుడ నీదాసుడ। నీభక్తులబంటుబంటు। నీప్రియసుతముడన్।
నీభజన సేయువాడను। శోభాయుతసుగుణధామ। సుందరహనుమా॥ ౧
తే॥ గీ॥ సఖ్యముగ నిన్ను బిలిచెద। ముఖ్యముగ నీదు। మనసు నొవ్వగ జేసిన।
మందమతుల। దగినశిక్ష నొందుట తప్పము। తథ్యముగను। యమునిగుణ
గేయపంచముఖాంజనేయ। ౨
క॥ ఏమి కలికాలమహిమో। నీమహిమో తెలియదాయె। నేమనవచ్చున్।
సామీరీమహాత్మ్యముల। యామిక మణగించవేమి। హనుమా వినుమా॥ 3
క॥ మున్నెన్నో సాహసములను। సన్నుతిజేసిన సుకార్య। సాధనమయ్యెన్।
మిన్నగ సాహసములు నా। కన్నా నీరాంజనేయ। కపికులరాయా॥ ౪
క॥ నమ్మిచెడిన వారలు లే। రమ్మా హాలో దేవతలను। హితప్రగమదిలో।
నమ్మిన చెడదరు గాన్ప్రస। నమ్మితి నిను వీరహనుమ। నయగుణధామా॥ ౫
క॥ అప్పని నుదించెదనా। తప్పుల నెన్నంగవలదు। తహతహపడుచున్।
జెప్పితి నాప్రార్థనము। లెప్పుడు మా మకవ్యాదబ్జ। దినకరహనుమా॥ ౬

క॥ మానావమానములు నే। పూనికతో నీవటంచు బుద్ధిదలచితిగా।
మానము దీయదలంచెడి। కానిదురాత్ములకు శిక్ష। గనుమాహనుమా॥ ౭
క॥ ఆర్తిని బాయదలంచియు। కీర్తించెద పలువిధముల। కేశవరేణ్యా।
మూర్తీభవించిదయవి। స్ఫూర్తింగనుమాంజనేయ। బుధజనగేయా॥ ౮
క॥ అల్లదుగో పాపకర్ములు। కొల్లలుగా గూడికొనుచు। గుసగుసలెంతో।
మెల్లగను జేయబూనిరి। కల్లనిజంబెల్ల నీవు। గనుమాహనుమా॥ ౯
క॥ మాటికిమాటికి కలహం। జేటికొయీకుజనసమితి। నేమనరాకే।
సూటిగ నినుదలచితియరి। కూటంబుల మదమణంచు। కుదురుగ హనుమా॥
క॥ యెన్నో మారులు నిన్నే। పన్నుగ భజియించినపుడు। ఫలమొసగితివా।
పన్నుడ క్రన్నన బ్రోవుము। కన్నకుమారుడను హనుమ। ఘనసమ్మానా
క॥ యిన్నాళ్లు నీదు భక్తిః। చెన్నుగనే జేసినట్టి। చెలిమిని గనుమో
యన్నా ముద్దులచిన్నా। నన్నికదయజూడు హనుమ। నయగుణధామా॥

తే॥ గీ॥ మర్కటేశుడవని నిన్ను। మరువకేను। దినముదప్పక భజియింతు।
చెలివిడనర। గానునా బాధలను బాపి। కష్టముదంబు। నొందజేయుము
హనుమయిం। పొందునటుల॥ ౧౩

—* పంచపాది *—

తే॥ గీ॥ శ్రమలబడి వార్ధిదాటిన। క్రమముగాను। లంకలో జేరి వేసారి। పొంక
మలర। జానకిని జూచినట్టియా। సంతసంబు। కొంతకొంతైన రానిమ్ము।
మంతనమున। నన్ను బ్రోవను హనుమంత। న్యాయవంత॥ ౧౪
సీ॥ ఆప్తులలో గొప్ప। యార్యుడవైజగ। దార్యకు బుత్రుడవైవివరయు।
శూరులలో దొడ్డ। శూరుడవైదాన। వాలినొంచినరణ। కేళినరయు। భక్తుల
లోనస। ద్భక్తుడవైనీదు। భక్తుల బ్రోచిన। పటిమనరయు। రామతారకముచే।
రాముడవైనీవు। సల్పునధ్యాత్మవి। చారమరయు।

తే॥ గీ॥ జననశూరత్వభక్తిత్వ। మనుపమాన। మైనవేదాంతసిద్ధిని। మాన్య
తముగ। నెంచదరమానె యేరికి। నించుకైన। యాదరించుము నన్ను
నీ రాంజనేయ॥ ౧౫
తే॥ గీ॥ బ్రహ్మచర్యవ్రతాభ్యాస। పరుడవైన। కపికులాధీశ నీదగు। కరుణ
కొరకు। భక్తిననురక్తితో చాల। భజనజేతు। శక్తితో కార్యముల
వేగ। జేయుహనుమ॥ ౧౬



తే। గీ॥ నినుగనకయున్న నాపజా। లనువిరాళి। పరగమదినెంచిగూప్పనా। పైనబాళి। సరగశిరమందుదాల్తునీ। చరణధూళి। హనుమ వేగంబె పరువిడు। నరిజనాళి॥ ౧౮

క॥ యిమ్మగనాదైవమనన్। సమ్మతిగానిన్నుదలతు। సదమలచరితా। యిమ్మహినినాదుశత్రుల। దుమ్మాదముగల్గుగాత। నొప్పుగహనుమా॥

క॥ వసుమతిలోనీకన్నను। వెసగానకనిన్నుదలచు। దీనుడనగునా। వెస జూచికరుణనుంచుము। బిసరుహపింగాక్షహనుమ। బీరము నగుమా॥

క॥ సీతారాముల నెంతయు। బ్రీతిన్ బ్రార్థించువాడ। భీతియులేకన్। చేతో మోదంబునగస్। పాతకములబాపుహనుమ। పరహితనామా॥ ౨౦

క॥ శంకరసుతశత్రువ్రులతి। సంకటపడునటులజేయు। సాహసచతురా। లంకాదహనముఁలిగ। సంకోచింపకయెహనుమ। సదమలనామా॥ ౨౧

క॥ లంకానాథుసన్నిధి। లంకాపురమందునీవు। లావుమెరయగన్। సంకోచింపకబల్కిన। పొంకము నెన్నంగదరమ। బుధనుతహనుమా॥ ౨౨

క॥ రక్కసులమదమడచిన। పక్కినిమద్రిఫుమదంబు। బాపుము వేగన్। చక్కనివాయుకుమారా। చిక్కితినీభక్తిలోన। స్థిరముగహనుమా॥ ౨౩

క॥ యెన్నోవిధములనిన్నే। సన్నుతిజేసెదనుమనవి। సరగునవినుచున్। చిన్నికుమారునిరీతిగ। మన్ననతోబ్రోవుహనుమ। మంజులనామా॥

## —* ఉత్సాహవృత్తము *—

సామినాదుచింతలెల్ల। సరగబాపవేమిరా।
నామదినిదలంతునిన్ను। నాదువేల్పువనుచునన్।
ప్రేమదలచియాంజనేయ। బీరముడిగిబ్రోవుమా।
కోమలారుణప్రభాంగ। కొండయార్యపోషకా॥ ౨౪

## —* మత్తకోకిల వృత్తము *—

అంతకాంతకపుత్రసన్నుని। రంతరంబుదలంచెదన్।
వంతనూనానామీదనీకిక। పావనీవరధీమణీ।
సుంతయేనియుబేర్మిజూడుము। సోమసోదరభాముఖా।
యెంతకార్యమునన్నుబ్రోచుట। యిప్డుకొండయపోషకా॥
జీవుడనుతెలివిమాలిన। భావజ్ఞులునేమిగాక। బలుమోదంబై। చేవగ నుందురువారల। కోవిదులే తెలియగలరు। కుదురుగహనుమా॥ ౨౫



—* కృత్యర్పణము *—

క॥ భవదీయకరుణచేసి। భువిలోగలసజ్జనాళి। బుధసేవకుడన్।
కవితాకన్యనొసంగితి। సవినయముగ రామలింగ। సజ్జనసంగా॥ ౧

క॥ చనశిష్టవైశ్యగోత్రుడ। వినయుడ శ్రీరాజయార్య। విమలసుతుండన్।
నినుదలచుకొండయార్యుడ। గొనుమీకృతి రామలింగ। కోవిదసంగా॥

తే॥ శ్రీమదానందవత్సర। జ్యేష్ఠబహుళ। పంచమీభృగువారము। దంచి-
తముగ। జెప్పినాడనుసీయాజ్ఞ। నొప్పునటుల। రమ్యగుణగణసంగ శ్రీ।
రామలింగా॥ 3

సంపూర్ణమ్.